శ్రీరస్తు.

శ్రీరామచంద్రాయ నమః

# ఆపద్బాంధవశతకము

మైసూరు దేశమందలి శ్రీనివాసపురము తా॥

గౌనిపల్లి గ్రామనివాసి

## గుమ్మరాజు రామకవిచే

విరచితము.

---:o:---

మైసూరు మహారాజావారి కాలేజి ఆంధ్రోపాధ్యాయ

శ్రీః రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిచేఁ

బరిశోధితము.

---:o:---

చిత్తూరు విక్టోరియా జూబిలీ ముద్రాక్షరశాలలో

ముద్రితము.

500 ప్రతులు. వెల 0-2-0

1926.

శ్రీరస్తు.

శ్రీరామచంద్రాయనమః

# ఆపద్బాంధవశతకము.

మైసూరుదేశమందలి శ్రీనివాసపురము తాలూకా

గాండ్లపల్లి గ్రామవాసి

## గుమ్మరాజు రామకవిచే

విరచితము.

---

మైసూరు మహారాజావారి కాలేజి ఆంధ్రోపాధ్యాయులు

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిచే

పరిశోధితము

---

చిత్తూరు విక్టోరియా జూబిలీ ముద్రాక్షరశాలలో

ముద్రితము.

500 ప్రతులు. వెల 0-2-0

1926.



శ్రీరస్తు.

శ్రీరామచంద్రాయనమః.

# ఆపద్బాంధవ శతకము.

శా. శ్రీవైదేహినిజోరు పీఠమున భాసిల్లంగ సౌమిత్రిసం
సేవింపన్ భరతుండు గొల్వఁ బ్రణతుల్సేయంగ శత్రు
ఘ్నుండెం
తేవాతాత్మజపూజితాంఘ్రి యుగళిదీప్పుంను నై మించు
నిన్
భావంబందుఁ దలంతు నెల్లప్పుడు నాపద్బాంధవా రాఘవా॥ ౧

మ. కవితల్సేయుచు రామనామమును నేడెంబద్భూ
సంబుచే
స్తవముల్సేయని జన్మమేటిదమునన్ ధన్యాత్ములుం
జాముభూ
ధనవంశోత్తమ! సత్కృపన్ముఖ్యమునే సంగ్రంథమర్పించెదన్
భవదీయాంఘ్రి పయోరుహంబులకు ॥ నాప ॥ ౨

శా॥ హేరంబున్నతి యొంపి బెడము సాహ్యద్వినిఘ్నావినిశ్రీ
గౌరీశంకరులం బలాది సుతులన్ గావించి సాహిత్యకన్

ధీరోదారులఁ బూర్వసత్కవుల కెంతేఁ మ్రొక్కి యీ సత్కృతిం
బ్రారంభించితి నీదుచిత్తమిఁక । నాప ॥ ౩

మ॥ విమలస్వాంతుని యాజ్ఞవల్క్యకుల సద్విప్రుఁ సహస్రాన్వయో
త్తము శ్రీరామపదారవింద భజనోద్యత్సూర్య నారాయణా
ఖ్యమహాపండితు మద్గురుం దలఁతు నాకబ్రాంతదవ్యామృతో
సమవాక్సంస్ఫురణ ప్రసిద్ధినిడ । నాప ॥ ౪

మ॥ జగతింబండితులెల్ల మెచ్చురను నాసంజేయలే దీక్షఁ
భగవద్ధ్యానమె ముఖ్యకార్యమగుటన్ భక్తప్రధానంబుగా
నిగమస్తుత్యుని నిన్ భజించుటయె నానిర్దిష్టసంకల్పమే
సగదంబ్రోతువొ నీయధీనమిఁక ॥ నాప ॥ ౫

మ॥ శివుఁడర్ధాంగికి వేడ్కమీరనుపదేశించెన్; గుహుండెట్టిభ
క్తవరుండయ్యె; నిషాదకాంతయుఁ గనుంధన్యత్వముం జెందె; నా
ప్లవగుల్పావనులైరి; తావకపరబ్రహ్మ స్వహాపాఖ్యనై
భవమాహాత్మ్యముచే నదెంతఘనం ॥ నాప ॥ ౬

శా॥ ఆపద్బాంధవ నామమెంతయును నీ కర్హంబగున్ సాక్షులై
యాపాంచాలి యహల్య హస్తిపతి ప్రహ్లాదాంబరీష ధ్రువ
ఖ్యాభూపాలాగ్రణి! సాకుచుండెదరు ముల్లోకంబులందట్టినీ
ప్రాపుం గాంచితి; ధన్యుఁడైతి నిఁక ॥ నాప ౭

శా॥ నీ నామవ్రతనిష్ఠ నీ కరుణయు న్నీ భ్రాతృవాత్సల్యము
న్నీ సుజ్ఞానత నీ ప్రతాపగరిమ న్నీ యోగసత్కీర్తియు
న్నీ సౌందర్యము నీమహామహిమలు న్నీ శౌర్యసంరంభ
ముల్
భాసిల్లన్ ధరనద్వితీయమగుచున్ ॥ నాప ౮

శా॥ ముక్త్యాకారవిధివ్రతంబులఁ జపంబుల్ సేయలేకున్న నా
సక్తిన్ ధర్మములం బరోపకృతులన్ సల్పంగలేకున్న వి
ధ్యుక్తోద్వృత్తిక్రియలాచరింపఁగ సమర్థుండైన ధన్యుండఁగన్
భక్తిన్నీ శుభనామముంబొగడ నాపద్బాంధవా రాఘవా!

మ॥ విమలంబై విగతాఘమై నిశితమై వింత్రై వివేకాఢ్యమై
కమనీయంబయి కర్ణరంజనమునై కల్యాణసాకల్యమై
యమృతాంశుండిలఁ జిల్కు వెన్నెలవిధం బానందసంధా
యియై
ప్రమదంబిచ్చుఁగదా భవచ్చరిత ॥ నాప ౧౦

శా॥ శాస్త్రార్థంబులొకింత గ్రంథములలో నీవేయ నట్లున్న నా
ప్రస్తావ్రతముల్ స్మరింపనెట్టి నూనపుడవై జన్మించితి వెంతయుం

పనుపన్నాఁగిన ఫణీంద్రముఖ్యులకు ॥ నాప ॥ ౧౪

మ॥ సవరిత్యాగమునాని నెంటఁ బనుపన్నంకించు సీతం ద్రియుల్
శివుచాపంబు నుద్దుంచి నీవవనిజం జేపట్టి దుర్వారభా
ర్గవగర్వంబడగింపఁగాంచి మదినొరాయెంతగా నుబ్బెనో
భవమున్ ఖ్యాతి! శక్యమాయెటుఁగ ॥ నాప ॥ ౧౫

మ॥ అలపద్మాసన నీలకంఠహితవేదారామ మందారమా
కలసచ్చాఖ నలంకరింపుము వడిన్ ధాత్రీతనూజాతకాఁ
వలియుల్ పంజరమందుఁ జిక్కి మధురోక్తింగత్పుణ్యభా
భాగ్యశో
జ్వలబింబంబుఁ గ్రహించు రాచిలుక ॥ నాప ॥ ౧౬

మ జనకక్ష్మాపపుత్రి ప్రాణముగఁ గౌసల్యామహాదేవియుం
బనవున్నంబులరాశిగా జనకుఁడానంద స్వరూపంబుగా
మునులున్ బ్రహ్మమయంబుగాఁగనిరి నీమూర్తిన్నదీ
యూవలం
బనమంగా గ్రహియింతునెల్లపుడు ॥ నాప ॥ ౧౭

మ॥ జనకాజ్ఞాపరిపాలనాదరమతిన్ సామ్రాజ్య పట్టాభిషే
చనసౌఖ్యంబవలీలఁబాసి వనవాసంబూనసంగీకరిం
చిన నీనిర్మలధర్మబద్ధగుణసౌశీల్యాదులెల్లన్నుతిం
పనసాధ్యంబ జరుద్రముఖ్యులకు ॥ నాప ॥ ౧౮

మ॥ అపరాధంబొనరించి యున్నవనమిత్రుండై నేను కాకాసురుం
గృపచేపట్టినమేటివేలుపవు నిన్ గీర్తింపశక్యంబె నా

యపరాధంబులనెల్ల నోర్చియును కంపాస్త్రంబిపాపాత్మకిం
బ్రపభంగింబోడ సూపి ప్రోవుమిఁక ॥ నాప ॥ ౨౦

శా॥ ఆటోబానకిమేని పోయగముమింపై చేతివిల్లింద్రచా
పాలంకారముగాఁ గృపారసవిలోలాపాంగ వృష్టాంబువుల్
గ్రోలన్నామది చాతకంబుగను నాంగుంపైన నిన్నెంచెదన్
బాలిఁపంగల కస్తివీవనుచు ॥ నాప ॥ ౨౧

మ॥ శిలసేపాదరజంబుసోఁకి చెలియై చెల్వొందె సుగ్రీవుఁడుం
జెలిమింజేసిరయుంబు సంబడసెఁ గిష్కింధాధిపత్యంబు వి
న్నలరంగోల్ప దశాస్యు తమ్ముఁడును లంకాధీశ్వరుండయ్యె భూ
పలలామా! మహనీయుఁడెవగుట నాప ౨౨

మ॥ వనధిన్మారుతిదాఁటిపోవుటను దుర్వారాసురానేకస్తితం
బును లంకానగరంబుఁ జొచ్చుటకు సంభూతప్రతిసేమంబుఁ గ
న్గానిట్టే తేయబలంబుఁ ద్రుంచుటకు శక్తుం డౌటనీనామపా
వనమంత్రామృతపానలబ్ధఫల ॥ నాప ॥ ౨౩

శా॥ మాతల్లిన్ జనకాత్మజన్ బొగడఁగా మాకొంట్లకున్
వాత్రాత్రోద్ధవ్వ పాలనుంగిదియుచో నైశ్వర్యదుంటేం
తయున్

శీతత్వంబువహించియుండఁగ మహాచిత్రంబుతద్దివిస
త్త్వాతిప్రవత్యమహాప్రభావఫల! మాప॥ ౨౪

శా॥ భూమీశోత్తముఁడే గుహుండుంపు చలిమింబోషింపఁగా బో
యలెం
ప్రేమంజూడఁగ నాలిపశుప్రవరుఁ డ్రీరత్నమే వానరుల్
నీముత్తాతతరంపుఁ జుట్టములెమన్నింపంగ సద్భక్తయే
ప్రాముఖ్యంబని యెంచుమేటిదొరఁ! వాప॥ ౨౫

మ॥ గిరులందెచ్చి సముద్రమందిడఁగ సుగ్రీవాదివీరాళితో
సరిగామన్నసఁ జేసినాఁడవు తనసద్భక్తికిన్మెచ్చిసా
గరమింగట్టిన నేఁ సల్పమగు కైంకర్యంబుఁ దాఁ
ఱ్పుటక్
బరమోత్కృష్టములౌర నీపదతే॥ లాప॥ ౨౬

శా॥ వాలింగూల్పఁగ నొక్కకోల నసదీక్ బంధింపఁగా
రావణు
న్నేలంగూల్చఁగనేరికైనఁ దరమా నీచేతనయ్యెంగదా
లీలామానుషమూర్తివని మునుల్లెక్కించుటల్
చిత్రమా?
ప్రాలేయాచలధీర! నన్మనుపు॥ మాప॥ ౨౭

మ॥ అరిసంహారముఁ కన్నఁ బూర్వము విలంకాధీశుగాఁ
దత్సహో
దరునింబట్టముగట్టి నావమటచేతన్ సిద్ధసంకల్పుఁడీ

శ్వరుఁడీపంచమఁ బ్రసిద్ధమేగద యిఁకన్ సందేహమేలా? పరా
త్పరునిన్నే భజియింతునెల్లపుడు ॥ నాప ॥ ౨౮

మ॥ జలధింగొండలు తేలియాడుటయుఁ గిశ్రావాతమెంతేమదో
జ్జ్వలదైత్యప్రికరంబుఁ గూల్చుటయునా చట్రాయిపూఁబోఁడియై
చెలువుంగూర్చుటయున్ భవన్మహిమచే యుత్తిఘోషింపఁగాఁ
బలుకన్వచ్చునె మమ్ముఁబోంట్లకిల ॥ నాప ॥ ౨౯

మ॥ ఫణితల్పుండగు నాదవిష్ణువనినిన్ భావించుటేవింత? రా
వణగర్వంబడఁగించి లోకములఁగావంబూని రంజిల్లుకా
రణజన్ముండవు మర్త్యమాత్రులకునౌరా శక్యమాసీపనుల్
ప్రణుతింతున్నిదయుండవై మనుపు ॥ మాప ॥ ౩౦

శా॥ నీమాహాత్మ్యము దానెఱుంగుట భవానీనాథుఁడేవేళనీ
నామధ్యానమొనర్చు నాతనియనూనంబౌ ప్రభావంబునీ
వేమోగన్గొని పూజసేసితివి రామేశాఖ్యలింగా కృతిన్
మీమాహాత్మ్యము మీరెఱుంగుదురు సుమ్మీశక్యమా జానకీ
భామానాథ యెఱుంగ నన్యులకు ॥ నాప ॥ ౩౧

శా॥ తమ్ముల్భక్తిని వినమ్రులై కొలువ సీతాదేవి వామాంకపీ
ఠమ్మందుండఁగ నాంజనేయుఁడులలాట న్యస్తహస్తాబ్జుఁడై

సమ్మోదంబున సంస్తుతింపఁగ మహాసంతోషివై యిడుమా
పమ్ముంజూడఁగ నాకి గొంటెనివు ॥ ఆప ॥ 32

మ॥ నగభేదిప్రముఖామరుల్మునులు నానాదేశనాథుల్ హితా
ప్తగురూత్తంసులు వందిమాగధుల మాత్యశ్రేష్ఠులుం గొల్వఁగా
జగదేకప్రభువై సభాస్థలిమహాసంరంభమందుండు మే
పగిదిన్నా మొఱవింటివో యెఱుఁగ ॥ ఆప ॥ 33

మ॥ మునులున్ శిష్యయుగంబులెంతయుఁ దపంబుల్సేసియుం జూడఁజా
లని బ్రహ్మంబు నరాకృతిన్ ధరణినేలంగాంచి హృష్టంచుమా
వననాకేత పురనివాసుల మహాభాగ్యంబు లెల్లన్నుతిం
పనసాధ్యంబహినాథముఖ్యులకు ॥ ఆప ॥ 34

మ॥ సిరిభూనందనగా సురల్ కపులుగా శేషుండు సౌమిత్రిగా
వరవైకుంఠము యోధ్యగా వెలసి కోల్వన్ రామభద్రుండవై
ధరణింబుట్టిన యాదివిష్ణువను తత్త్వంబాత్మఁ జింతింపుచుం
బరమానందమునొందఁ జేయుమెపు ॥ ఆప ॥ 35

శా॥ హనూమాంకస్థితజానకీప్రియసుధావాక్యంబు లాలింపుచుం
బ్రేమాపాంగతరంగి సమ్మిత గంభీరాంతరంగుండవై

యేమోహంబుచ్చటలాడు వేళనయినన్ హృద్వీధినాగ్రావన
ప్రాముఖ్యాన్వయ ధర్మమున్మఱువ ॥ వాప ॥ ౩౬

మ॥ అమరేంద్రాదుల కద్భుతంబొదవు మాహాత్మ్యంబుతో
నీవులో
కములంబాలనసేయుచుండఁగ భవత్కారుణ్యముం
గోరి డెం
దములన్నిన్నుభజించువారు సుఖులై ధన్యాత్ములై యెల్లపా
పములంబాసి కృతార్థులౌటరుదె ॥ యాప ॥ ౩౭

శా॥ చండాంశూత్తమ వంశవారాశికరుణాసాంద్రుండ నూ
నుంబుబ్ర
హ్మాండంబేలు మహాప్రభుండనుచు నిన్నాశింపమా
నంబుతో
నుండంబోలునె యాదరింపఁదగదే యొక్కింత నాప్రాప్తి
యుం
బండో కాయయొ నీయధీనమిఁక ॥ నాప ॥ ౩౮

శా॥ కల్యాణాత్మకమా భవచ్చరిత మాకర్ణింపుచుంజిత్తచాం
చల్యంబించుకలేకతావక పదాబ్జధ్యానపారీణనై
ర్మల్యానందమునొంది భక్తతతినారాధింపుచున్ జన్మసా
ఫల్యంబొంద ననుగ్రహింపు మిపు ॥ డాప ॥ ౩౯

మ॥ నిమలంబై మధురంబునై వెలయు నుర్వి న్నీకథాయూపమా
నమృతంబుంజవిచూచిచూచిబుధులాప్లావింపఁగాసద్విజుల్

ప్రమదంబొందఁ గళాప్రపత్తిఁ దమముల్ పాఱంగఁ జంద్రోదయో
పమమౌ నీముఖదర్శనంబొసఁగు ॥ మాప ॥ ౪౦

శా॥ త్రైలోక్యాధిపతిత్వముం గనియు శాంతంబు న్వివేకంబు న
చ్ఛీలంబుం దయ యున్వహించి మునులుం జేజేలుగీర్తింపఁగా
మేలుంగూర్చెను వాఁడవీవగుట నాపిల్లనింగృపాబుద్ధి చేఁ
బాలింపంగల వంచు నేఁదలఁతు ॥ నాప ॥ ౪౧

శా॥ దాసుంగావను వేఁడు సేయుటిదియే ధర్మంబు యోచింపనీ
వాసీతావదనార విందమకరందా స్వాద ప్రాపితో
ల్లాసోన్మత్త మధువ్రతుండగుట నేలాగో ప్రబోధంబునా
పై సంతోసపుఁ జూపులంబఱపు ॥ మాప ॥ ౪౨

శా॥ దారానందమయోక్తి లాలన వినోదన్యస్తచిత్తు సోదరో
దారారాధ్యవికాసమౌ బుధజనాధారిం ... మించుపే
కారుణ్యామృత పూరితాంచిత కటాక్ష శ్రీలనొక్కింతనా
పై రాలిమ్మని వేఁడుకొంటిని ॥ దాప ॥ ౪౩

శా॥ ఆపజ్జాలమడంపనేర్తును మదీయాజ్ఞాన కృత్యంబులం
బాపన్నేర్తును ముక్తిమార్గమును జేర్పన్నేర్తు దుర్వారసం
తాపంబుల్ హరియింపనేర్తు నుచిదానందంబు సేకూర్తునీ
ప్రాపుంగాంచితి ధన్యుఁడై తిరిక ॥ నాప ॥ ౪౪

మ॥ శుభసంపత్ప్రదమై సుధామధురమై సుజ్ఞానసంబోధ్యమై
సభవద్దివ్యచరిత్రమెల్లపుడు నానందంబుతోడం బఠిం

పభజింపంగ ననుగ్రహింపుమని నిఁబల్మారుప్రార్థింతునో
ప్రభువంశోత్తమనఁ గృపన్మనుపు ॥ మాప ॥ ౪౫

మ॥ దురితంబుల్దొలఁగించు శత్రుచయముందోలున్మహా భీలదు
ర్భరదారిద్ర్యమడంచు నాపదలనాపన్నేర్చు నిష్టార్థసి
ద్ధిరహింపజేయుఁ బఠించుమాత్రమున నీదివ్యాహ్వయం
బేనునఁ

బరిమాశ్చర్యములొగ శ్రీస్మహాను ॥ లాప ॥ ౪౬

మ॥ జగతిన్నిక్కిలి కష్టసాధ్యమగు రాజత్సేతు కాశీ ప్రయా
గగయా దుర్లభమగుయాత్రలఁ గలుగు భాగ్యంబుంబ్రసా
దించునీ

సుగమంబైనగు రామనామజపముంచు న్నిర్వివాదంబుగా
భగవద్భక్తులు పల్కుచుందురెపు ॥ నాప ॥ ౪౭

మ॥ సరిసాంకుండయి నిలకింతహితుఁడై సన్మార్గసంచారణా
భిరతుండై శరచాపయుక్తుఁడయి భూభృచ్ఛేఖరుండై నో
హర నీలద్యుతిధారియై నిఖిలలోకాధారుఁడై వాహినీ
శ్వరసత్యాశ్రయుఁడౌ ఘనుండవిల ॥ నాప ॥ ౪౮

మ॥ కలధౌతాచలశృంగ మధ్యవిలసద్గాంగేయ సౌధాంతరో
జ్జ్వలపీఠంబున భర్తృభక్తినుపదేశం బియ్యఁగాగౌరిని
శ్చలితాత్మన్ బఠియించు మంత్రమట యుష్మన్నామ
ఘనామంత్రమే

భళినాకబ్బెను నాకదేశరణ ॥ నాప ॥ ౪౯

మ॥ వనజాతోద్భవ గోత్రభిత్ప్రముఖదేవ వ్రాతకోటీర ర
త్ననికాయాంశు లసద్భవచ్చరణ పద్మధ్యానభాగ్యంబునా
కనుకూలించెఁ గొఱంతలేదిఁక మదీయాభీష్టసంసిద్ధియర్
పనిముంగొంగు పఱిండినాఁడ నతు ॥ నాప ॥ ౫౦

శా॥ ఏలాపల్కవు పిల్వగాఁ మఱచినావేమో ప్రమోదంబులో
బాలామండల మావరించికొలువర్ భార్యాసమేతంబుగా
లీలోద్యానవిహారలోల మతివై లెక్కింపవో నామొఱం
బాలింపంగలవారలెవ్వరిఁక ॥ నాప ॥ ౫౧

శా॥ కామారిస్తుత దివ్యనామ నరమేఘశ్యామ మౌనీంద్రహృ
ద్ధామా సూర్యసమానధామ మహిమోద్దామా పరంధా
మ శ్రీ
రామా రాజలలామ రక్షితసుపర్వస్తోమ శ్రీజానకీ
భామా మానసకామ నిన్ గొలుతు ॥ నాప ॥ ౫౨

మ॥ వసుధం దల్లియుఁ దండ్రియుంగురువు దైవంబెల్ల నీవంచు మా
నసమందేను భజించుటీవెఱుఁగవా నామీఁదనీ సత్కృపా
రసలేశంబును బారనిచ్చినఁ గృతార్థత్వంబునేఁ గాంతుదా
నసంస్తుత్య! పరాకుసేయవల ॥ దాప ॥ ౫౩

మ॥ మమతంజూపకనీవు జాగుసలుపన్ క్ష్మాపుత్రితోఁజెప్పవాఁ

డ మదీయంబగువార్తఁ దండ్రికృపనీడందల్లి కారుణ్యపూ
ర్ణమతింజూడ కుసేకుసేయఁగలదే? నన్నేలమి న్నిన్నుఁగో
పమునంజూచు వచించినాఁడవిను ॥ మాప ॥ ౫౪

శా॥ రామున్నమ్మినవానికే కొదవయున్రాదంచు శీలంబునన్
సామర్థ్యంబున రామమూర్తికెవరున్ సామ్యంబులేరంచు నిం
దేమాత్రంబును సందియంబునిడరా దీమాటముమ్మాటికిం
ప్రామాణ్యంబని సాటిచెప్పఁగల ॥ నాప ॥ ౫౫

మ॥ తలఁపన్వాసవముఖ్యదేవతలకాధారంబు, సుజ్ఞానసా
రలసద్యోగిజనాళికెంతయుఁ బరబ్రహ్మస్వరూపంబు, భూ
వలయఖ్యాతమునిప్రకాండములకు స్వర్గస్థియాగాది స
త్ఫలమానీముఖదర్శనంబొసఁగు ॥ మాప ॥ ౫౬

మ॥ విలసిల్లన్సుమనోభిరామముగఁ బృథ్వీజానురాగంబుచేఁ
జెలువుంగాంచి మరుత్కుమారకృత సంసేవాగతానందము
ల్గలవాఁడై, శుకముఖ్యసద్ద్విజకులాలాపంబులుప్పొంగస
త్ఫలసిద్ధిందయసేయుమాధవుఁడ ॥ వాప ॥ ౫౭

శా॥ ఏమోపల్కవునా మొఱన్వినవు నీకేలాపరాకింత? నీ
నామంబేశరణంబటంచు మదిలోనన్నమ్మినన్వేడఁగా
మోమున్జూపవిదేమి దీనుఁడగునన్మోదంబుతో మైథిలీ
భామానాయక! ప్రోవఁజాగువల ॥ దాప ॥ ౫౮

శా॥ దేవాయాత్రికనెత్తిరింగి పోవంగల పృథ్వీభర్తవే వేగదా
నీవేదిక్కనినమ్మియుండు నను మన్నింపన్మహాభారమా!
రావయ్యా కరినేలువేళఁ గల సంరంభంబు వాత్సల్యముల్
భావంబందొకయింతఁ బూను మిపు॥ డాప ॥ ౫౯

మ॥ ధరణీనాథులసమ్ముఖంబులను, విద్వజ్జాలరాజత్సభాం
తరసంభాషణవేళలందు, విలసద్ధర్మంబధర్మంబులం
బరిశోధించెడువేళ, నీకరుణనాపై నిల్పి నన్నుద్ధరిం
పరమాధీశనినుండలంతు నెపు ॥ డాప ॥ ౬౦

శా॥ మౌనీంద్రుల్తెలియంగలేరట భవన్మాయాప్రకారంబు సు
జ్ఞానంబింతయులేని మూర్ఖుఁడనెఱుంగన్నేర్తునే నేను? నీ
ధ్యానంబేశరణంబటంచు నెపుడాత్మన్నమ్మిసేవింతునా
పై నీవేదయఁజూపఁగావలయు ॥ నాప ॥ ౬౧

మ॥ విమలవ్యోమమునందుఁ జుక్కలగముల్వేయుండినన్వ్యర్థమే
తిమముంబాఱఁగఁదోలఁగానొక సుధాధాముండు చాలు
స్మహో
త్తమసత్యానిశుభనామమొక్కఁ బరమంత్రంబుల్వృథాగాదె పా
పములంబాశి కృతార్థుఁడౌటకిల ॥ నాప ॥ ౬౨

మ॥ అరిమధ్యంబునఁ జిక్కుకాలమున జాడ్యగ్రస్తుఁడౌవేళఁ ద
స్కరులడ్డంబగుచోట దుష్టమృగముల్సంధించిబాధించుచో
కరుణంగంటివిగాచు తెప్పగతివేగన్ డాపునంజేరి నన్
బరిపాలించుట నీదుభారమిఁక ॥ నాప ॥ ౬౩

మ॥ కరుణంజిత్తవికారమాపి నియమార్గంబుం బ్రసాదించి సు
స్థిరశాంతంబు వివేకముం గఱపిన్ జేపట్టి రక్షింపుమా
పరవిత్తంబులఁ గాంచి కైకొనెడు దుర్భావంబు వాటిల్లి దోఁ
బరకాంతాభిముఖంబు నొందు నెడ ॥ నాప ॥ ౬౪

శా॥ దోషాక్రాంతపయోరుహంబునకు ఖద్యోతోదయం బట్లు నా
దోషాక్రాంతమనోంబుజంబునకు నెంతో తెల్వి వాటించి సం
తోషంబున్ ఘటియించు నీదు భజనానుష్ఠానమబ్బెంగదా
భాషానాయకసన్నుతుండవగు ॥ నాప ॥ ౬౫

మ॥ సతతానందదరామనామ జపనిష్ఠన్ భక్తియున్బెంపర
స్థితమౌ మామకచిత్తకీరమిఁక భీతిం జెందనేలా? పురా
ర్జితపాపౌఘబిడాలపంక్తికని కూర్మిన్నమ్మితిం జానకీ
పతి! నీచిత్తము నాదుభాగ్యమిఁక ॥ నాప ॥ ౬౬

శా॥ దానాఘౌఘఘనాంధకారదళనోద్యద్భావదశాత్యోన్మదయా!
వ్యాసాద్యుత్తమమానిమానసతరువ్రాతాప్తపత్రోద
యా!
కౌసల్యావరగర్భవారినిధిరాకాచంద్రబింబోదయా!
భాసిల్లం గృపనన్ను బ్రోవుమిఁక ॥ నాప ॥ ౬౭

మ॥ ఖలభూయిష్ఠపులోకమందు నిక భోగప్రీతిగాఢంబు, చం
చలవృత్తంబు మనంబు, కష్టతరముల్సంసారతాపత్రయం
బులు, గానన్ దృఢభక్తియుక్తమతి నిన్ బూనింపలేనైతి భూ
పలలామా! ననుఁ బ్రోవనీవే గల ॥ వాప ॥ ౬౮

శా॥ వేదాంతంబులెఱుంగ, యోగివరులన్ వేమారుసేవించి గ
ర్వానుష్ఠానవిశిష్టముం దెలసి యాత్మానందముం జెందగా
లే దేమంతుఁ గృతార్థుఁడా తెలివికన్ రక్షింపవే రెద్ది నీ
పాదధ్యానము కాక లోకమున ॥ నాప ॥ ౧౯

శా॥ నేరంబుల్ క్షమియించి వాంఛితఫలానీకంబులం గూర్చి చే
లో రాగంబొనరింపుచున్ ననుఁ గృతార్థుం జేయఁగాఁ జాలు నీ
కారుణ్యామృతవాహినీ స్ఫురదపాంగశ్రీల నొక్కింత నా
పై రానిమ్మని వేడుకొందు నెపు ॥ డాప ॥ ౨౦

మ॥ శరణన్నం గరుణించు నిన్ బొగడఁగా శక్యంబె? సీతామనో
హర! నాపాపచయంబడంచి భవదీయానూనకారుణ్యమే
దురవీక్షాతతి నాపయిం బఱపి సంతోషంబు సంప్రాప్తుమా
పరమోత్కృష్టచరిత్ర! నిన్ దలఁతు ॥ నాప ॥ ౨౧

మ॥ భువనంబుల్ సృజియింపఁ బెంపలయముం బొందింపఁగాఁ
జాలు క
ర్తవు నాయాపదలాపి కాచుట యసాధ్యంబౌనె నీకున్ వరన్
భవదీయాంఘ్రిసరోరుహస్మరణమే భాసిల్లు భావింపఁగా
భవరోగంబున కౌషధంబగుచు ॥ నాప ॥ ౨౨

శా॥ నీ పేరున్ భజియింపుచున్ మనమునన్ నీరూపు భావింపుచున్
నీ పాదాబ్జములందలంపుచు సదా నిన్నే మదిన్ నమ్ముచున్
నీ పాలంబడి వేఁడుచుండు నను మన్నింపంగ నా దోషము
ల్బాపన్ బద్ధుఁడవంచు నేఁ దలఁతు ॥ నాప ॥ 23

శా॥ నన్నీ రీతినుపేక్షసేయుటిదియే న్యాయంబు? నాదోసము
లన్నింపంగలవారు వేరెవరు? రామధ్యానపారీణుల
న్మన్నీ వెందఱింగాచినాఁడవో! మహాత్ముండైన నిన్నెంతునా
బన్నంబుల్కడతేర్చికావుమిఁక ॥ నా ॥ ౨౪

మ॥ కరిరాజోపరిభాగ సుస్థితుఁడు శుక్రుండంగాంచిభీతిల్లునే?
సురభూజాశ్రయభాగ్యవంతుఁడెవ్వఁడు క్షుద్బాధకుంగుం
దునే?
హరిభక్తుండు పురాకృతాఘములకై యావంతభీతిల్లునే ?
పరమానందముతో సుఖింపఁగలఁడాపద్బాంధవా ॥ ౨౫

శా॥ నాయాపన్నికరంబడంపఁగల నీనామామృతప్రాశనో
పాయంబొక్కటి లభ్యమయ్యెనిఁక నాభాగ్యంబుసామా
న్యమే?
మాయాతీత పవిత్రమూర్తివగుట న్మన్నించినీధ్యానముం
బాయంజాలనియట్టుసేయు మెపుడాపద్బాంధవా ॥ ౨౬

శా॥ నీనామస్మరణప్రభావము భవానీనాయకుండు భవ
ధ్యానవార్ధిభవమాంజనేయుఁడును త్వత్పాదాబ్జరేణుప్రభా
వానందంబు నహల్యయుందెలసి సన్నారాధనల్సేయ నీ
పై నేనెంతటివాఁడఁ జిత్తమిడ ॥ నాప ॥ ౨౭

శా॥ ఎన్నోచేసితిఁ బాపకర్మముల నన్నేరీతిరక్షింతువో?
నిన్నే నమ్మితి నేనొనర్చినయఘానీకంబు లెంతోదయ
న్మన్నింపంగల భారకర్తవని యుష్మద్దాసుఁగానెంచి నా

బన్నంబుల్గడతేర్చి కావఁదగు ॥ నాప ॥ ౭౮

శా॥ అజ్ఞానంబునుబాఱదోలి భవదీయాంఘ్రిద్వయధ్యానమో
గజ్ఞానంబొనగూర్చి సాధుజనసాంగత్యంబుసేకూర్చి య
ల్పజ్ఞున్నన్నుఁ గృతాపరాధునిదయం బాలింపఁగానేర్చు స
ర్వజ్ఞుం బూతచరిత్రునిన్ గొలుతు ॥ నాప ॥ ౭౯

మ॥ మదిలోసుస్థిరభక్తినొంది ఘటికామాత్రంబు సర్వజ్ఞునిన్
సదయున్నిన్నుభజించు మానవులకష్టంబుల్ని వారించిప్రో
చెదవెల్లప్పుడుకొల్చు భక్తతతికిన్సిద్ధింపఁగాఁజేయున
ప్పదవిన్నాకు ననుగ్రహింపుమిపు ॥ డాప ॥ ౮౦

మ॥ కలలోనైన భవన్ముఖాంబుజము నాకందోయికింజూచుభా
గ్యలవంబబ్బినఁ జాలునంచుమదిలోఁ గాంక్షించితిం
జంద్రమం
డలముంజూడఁ జకోరముల్తలఁచు చందానన్ రఘూ
త్తంస! నా
ఫలమెట్టున్నదొ నీదుచిత్తమిఁక ॥ నాప ॥ ౮౧

మ। కనకాంభోరుహ జాలరమ్యసుమనఃకాసార సంచారసం
జనితానందమయాంతరంగముగు హంసంబొండుచో
నుండనో
ల్లనిభంగింజన నేర్చునేగుణగణాలంకారునిన్గొల్చుచే
పనిగాఁగల్గినచిత్త మొండుకడ ॥ కాప ॥ ౮౨

శా॥ వేదోద్ధారక, మందరోద్ధరణ, పృథ్వీభారధారేయ, ప్ర
హ్లాదారాధ్య, వటూత్తమా, భృగుకులాలంకార, సీతాధిపా,
చేదీశాంతక సుప్రబుద్ధ, తురగశ్రేష్ఠాధిరూఢా, భవ
త్పాదాంభోరుహ సేవనాకొసఁగు ॥ మాప ॥ ౮౩

మ॥ అలుకన్ బూనఁగనేమికారణము నిన్నాశించుటే దోసమా?
పలుమారిట్టుదలంచు నంచు విసుగా? పాటించినాతో వెసన్
బలుకన్రాదె పరాకిదేల పలుకేబంగారమా? నాతపః
ఫలమీనీశుభనామ సంస్మరణ ॥ మాప ॥ ౮౪

శా॥ చింతింతున్ భవదీయరూపమును నాచిత్తంబునందెప్పుడు
న్నెంతు న్నారసనాగ్రమందునెపుడు న్నీనామమంత్రంబు స
ర్వాంతర్యామివి నీవెఱుంగనిరహస్యంబేమి సన్నేలఁగాఁ
బంతంబేటికిఁగమ్ము వేగమున ॥ నాప ॥ ౮౫

శా॥ ఏకాలంబుననోసినుంగొలుచు నాకిష్టార్థముల్పొందిలో
కైకఖ్యాతమహాత్ముఁడై రనెడు సల్కీర్తిండ నీమధ్యలో
నీకారుణ్యముచేత గోపనయుఁ జెందెన్మోక్షసామ్రా
జ్యముం
బాకారిస్తుత భద్రశైలమున ॥ నాప ॥ ౮౬

శా॥ నావిశ్వాసమదింతయే నరుఁడునానాకర్మముల్చేసియుం
దేవోత్తంసు నినుస్మరించినెలపి భక్తింగొల్చి నస్మత్కుఁడా
నీవేకారణకర్తనన్నిటికి మన్నింపంగశిక్షింప నీ
భావంబొప్పినయట్టుసేయు మిఁక ॥ నాప ॥ ౮౭

శా॥ నీకారుణ్యము నొందఁ గోరి మనసున్నీకే సమర్పించి నా
కేకార్యంబును దోఁచకెల్లపుడు నాయిష్టార్థముల్గూర్పఁగా
నేకాలంబు వత్తువో యనుచు నే నీరీతి నాశింపఁగాఁ
బాకారిస్తుత! ధర్మమా విడుము ॥ ఆప ॥ ౮౮

శా॥ నాయాపన్నికరంబడంచి దయతో నన్నేలుకొమ్మంచు నెం
తో యాశించితి నెట్టులైన స్వతంత్రుండవుగావే? మమ
త్వమేలా? శరణాగతావనసద్విఖ్యాతి నాపట్టునన్
బాయంజాలుదె? నీదు చిత్తమిఁక ॥ ఆప ॥ ౮౯

శా॥ లోకారాధ్యుఁడవు భక్తపాలకుఁడవు సుశ్లోకుండవు శాంతుం
డవున్
నీకీర్తిన్విని యాశ్రయించు జనమున్మన్నింపఁగ రావేటికో?
నాకష్టంబెడలించి చిత్తమునఁ గానందంబుఁ జేకూర్చుమా
పాకారిస్తుత! నిన్ భజింతునెపుడు ॥ ఆప ॥ ౯౦

మ॥ ధరనాయాపదలెల్లఁ బాపఁగల యాధారంబుగా నెంచుచుం
గరముల్మోడ్చి నుతించు నాపలుకులాకర్ణించి సంతోషివై
దరహాసంబొలుకం గృపారసనుధాధారాభిరామాక్షి వీక్షాపరం
పరలన్నన్నలరించు టెప్డు చెపు ॥ ఆప ॥ ౯౧

శా॥ రమ్మా నాకడ కేవొనిప్పుడు సపర్యల్ప్రీతి మీరంగఁ గై
కొమ్మా యించుక సేపు నాదు వినయోక్తుల్వేడ్క నా
లింపుమా
సమ్మోదాంచితసౌఖ్యదాయక భవత్సందర్శనామూల్యలా

భమ్మున్నాకుననుగ్రహింపుమిఁక ॥ నాప ॥ ౯౨

శా॥ నీసందర్శనసౌఖ్యమబ్బునెపుడో నీపాదసేవాసము
ల్లాసంబెప్డులభించునో తులసిపూలన్నిన్నుఁ బూజించిసం
తోసంబొందుటదెన్నఁడో యనుచుసద్బుద్ధిన్విచారించున
భ్యాసంబుందయసేయు మెల్లపుడు ॥ నాప ॥ ౯౩

శా॥ యోగ్యంబౌసహవాసముంగలిగి చిత్తోపాధులన్వీడినై
రాగ్యంబొంది సమస్తమెంచుచుఁబరబ్రహ్మస్వరూపంబుగా
భోగ్యార్థంబగువస్తువంచుఁ బ్రణవంబుంగాంచి భావిం
చు మే
ల్భాగ్యంబొందినవాఁడెధన్యుఁడిల ॥ నాప ॥ ౯౪

శా॥ కారుణ్యంబునకాటపట్టు సుగుణాగారంబురాజత్సదా
చారస్థానము ధర్మరూపము కళాసారంబునై యొప్పుని
న్నారాధింపక యన్యుఁగొల్తురే? యమర్త్యానోకహం
బొల్లకే
వ్వారల్బూరుగు నాశ్రయించఁగల ॥ రాప ॥ ౯౫

మ॥ నయరీతిన్నినుఁగొల్చువారి నభిమానంబొప్పనిష్టార్థము
ల్దయమీఱంఘటియించికాచుట యథార్థంబేనిచన్నేలఁగా
రయమొప్పంజనుదెమ్ము తప్పవలదో రామయ్య! మాయ
య్య! నా
భయముందీర్పఁగదయ్య జాగువల ॥ దాప ॥ ౯౬

శా॥ హీనుంగఁ డాసఁ జేరినావనుచు నీయిల్లాలుతప్పించునో?
భూనాథుల్పరిహాసమాడెదరొ? యాప్తుల్వెన్న వారింతురో?
దీనుంగాచుకృపాసమృద్ధి కభినందించంగలారెవ్వర
ప్పా! నా కాప్తులునీవుగాకపరు ॥ నాప ॥ ౯౭

శా॥ శాంతాకారము సుస్మితాస్యమవనీ జాతానుషంగాంక
ముల్
సంతోషాతిశయాత్తవీక్షణ విలాసంబుం గృపాపూర్ణను
స్వాంతంబుంగలనీస్వరూపము సుధాసాంద్రంబుగా
నెంచెదన్
బంతంబేటికినన్నుఁబ్రోచుటకు ॥ నాప ॥ ౯౮

శా॥ కంటింగాచెముతెప్పకై వడిని భక్తవ్రాతముం జేరివె
న్వెంటంబాయకకాచుచుందు వనుచున్విజ్ఞుల్వచింపంగనే
వింటిన్ స్వానుభవంబుగా నెఱిఁగితిన్వేయేల నీనెయ్యపుం
బంటుంగాఁగనను గ్రహింపుమికఁ ॥ నాప ॥ ౯౯

మ॥ ప్రమదోద్యానమునుండి సీతప్రియ మొప్పందెచ్చి చేదో
యిచే
నమరంగూర్చినపూలదండ నధికానందంబుతో నొందు
చుం
దమునన్మత్కృతపద్యపుష్పవిల సద్దామంబు భక్తౌఘమున్
భ్రమరంబుల్చవిఁజూడ నందుకొను ॥ నాప ॥ ౧౦౦

శా॥ శ్రీమన్నందవరాన్వయాబ్ధిప్రభవుఁడు వాసిష్ఠాఖ్యగోత్రుండు శ్రీ
రామన్యాసపరాయణుండు గవితారమ్యుండు శ్రీగు
మ్మారా
ణ్ణామాత్యత్కులజుండు రామకవియానందంబునం జెప్పెనీ
పైమాధుర్యములొల్కనీశతకమాపద్బాంధవా రాఘవా॥

శ్రీరామచరణారవిందార్పణమస్తు.

శుభమసు.



